శ్రీరస్తు



# శ్రీ ఆంజనేయదండకము.

ఇది

భక్తులు ప్రార్థించుట కనువుగా నుండునట్లు

మంగు వెంకట రంగనాధరావు, గారిచేత

ముద్రించి ప్రకటించబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

శ్రీ వేంకటేశ్వర విద్యాసాగర ముద్రాక్షరశాల.

కాకినాడ.

1913

శ్రీ ర స్తు.

## శ్రీ ఆం జ నే య దం డ క ము.

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాది
వ్యకాయం ప్రకీర్తిప్రదాయం ప్రశస్తప్రకాయం భ
జేవాయుపుత్రం భజేవాలగాత్రం భజేసూర్యమి
త్రం భజే హం పవిత్రం భజే రుద్రరూపం భజే
బ్రహ్మ తేజం బటంచున్ ప్రభా తంబు సాయం
త్ర మున్నిన్ను సంకీర్తనల్ జేసి నీరూపువర్ణిం
చి - నీకీర్తనల్ బెంచి నీపాద పద్మంబులం గొ
ల్చి నిన్ దల్చి నీమీదనే దండకంబొక్కటిం జేయ
నూహించి - నీమూర్తిగాంచి నీసుందరంబెంచి నీదా
స దాసాన దాసుండనై - రామ భక్తుండనై నిన్ను
నే గొలిచెదం - నిన్ను నేదల్చెదం నీకటాక్షంబు
నం జూచితే వేడుకల్ జేసితే - నామొరాలించితే న
న్ను రక్షించితే అంజనాదేవి గర్భాన్వయాదేవ ని
న్నెంచ నేనెంతవాడం దయాశాలివైజూచితే - దాత
వై బ్రోచితే దగ్గరం నిల్చితే తొల్లి సుగ్రీవు కున్మం
త్రివై - స్వామి కార్యంబు నందుండి శ్రీరా
మ సౌమిత్రు లంజూచి వారిన్వి చారించి - సర్వే

వ్వాలి సంజంపి కాకుస్థ వంశ్యుం దయా దృష్టి వి.
క్షించి - కిష్కింధ యేలించి శ్రీరాము కార్యా
ర్థమై లంక కేతెంచియున్ - లంకిణిన్ జంపియున్
లంకయుం గాల్చియున్ భూమిజం జూచి యానంద
ముప్పొంగి - యాయుంగరంబిచ్చి యారత్నముందె
చ్చి శ్రీరాము కుంనిచ్చి సంతోష లం జేసి - సుగ్రీ
వుడా అంగదా జాంబవంతాది నీలాదులం గూడి -
యా సేతువుం దాటి యావానరామూక పెన్మూక లై
దైత్యులం దుముంచగా - రావణుం డంత కాలాగ్నులై
యుగ్రుడై కోరి బ్రహ్మాండమైనట్టి - యాశ
క్తియుం వేసి యాలక్ష్మణుం మూర్ఛగావించగా నప్పు
డే వేగ సంజీవియుం దెచ్చి సౌమిత్రికిం నిచ్చి ప్రాణం
బురక్షించవా - కుంభకర్ణాదులం వీరాదివీరులంమ
రింబోరి - శ్రీరాము బాణాగ్ని వారందరిం రావణుం
జంపగా - సంతలోకంబు లానందమైయుండి య
వ్వేళలం యవ్విభీషణుం వేడుకం దోడుకన్ వచ్చి ప
ట్టాభిషేకంబు చేయించి - సీతామహాదేవియుం దెచ్చి
శ్రీరాముకున్నిచ్చి సంతయోధ్యకుం వచ్చి పట్టాభిషే

హుంకారమిచ్చి తేరించుమన్నించినం- రామభక్త ప్రశస్తం
బుగానిన్ను నీనామసంకీర్తనల్ జేసితే- పాపముల్ బా
యవే భయముాలందిరవే - భాగ్యముల్ గల్గునే సర్వ
సామ్రాజ్యముల్- సకలసంపత్కరముల్ గల్గునో వా
నరాకారమే - భక్తమ్మందారమే పుణ్యా సంచార
యోధీర యోధీర నీవేసమస్తంబు - నీవేమహాజయం నీ
వేమహాఫలముగావెలసి - యీతారక బ్రహ్మమంత్రం
బు పఠియించుచుం స్థిరముగా వజ్రదేహంబునుం దా
ల్చి శ్రీరామ శ్రీరామ శ్రీరామయంచుం పునఃపూ
తమై యెప్పుడుం దప్పకం దల్చునాజిహ్వా యం
దుం- దీర్ఘదేహంబునం త్రైలోక్యసంచారివై రామ
నామాంకితధ్యానివై బ్రహ్మవై బ్రహ్మతేజంబునం - రౌ
ద్రనిశ్వాసకల్లోల హావీరహనుమంత ఓంకారఓంకార
శబ్దంబులం ననేకభీతిం పిశాచంబులం కామినీ మో
హినీ శాకినీఢాకినీ గాలిదయ్యంబులం - నీదువాలంబు
నంజుట్టి నేలంబడంగొట్టి నీముష్టిఘాతంబులం బా
హుదండంబులం రోమఖడ్గంబులం ద్రుంచి కాలాగ్ని
రుద్రుండవై బ్రహ్మపరిభాభాసితంబయిన నీదివ్యతేజం
బునుం జూచి. రారనాపుడు నరసింహాయంచుం ద

యాదృష్టివీక్షించి నన్నేలు నాస్వామి నమస్తే నమ బ్రహ్మచారీ నమస్తే వాయుపుత్రా నమస్తే ప్రభాపూర్ణహారీ నమస్తే నమస్తే నమః శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఆంజనేయదండకము సమాప్తము.

శ్రీ రస్తు

సూర్యనారాయణ దండకము.

శ్రీసూర్యనారాయణా, వేదపారాయణా, లోకరక్షామణీ, దైవచూడామణీ ఆత్మరక్షా, నమో పాపశిక్షా, నమో విశ్వకర్తా, నమో విశ్వభర్తా, నమో దేవతా చక్రవర్తీ, పరబ్రహ్మమూర్తీ, త్రిలోకైకనాథాధినాథా, మహాభూత భేదంబులన్నీ నవై, పోవ్రు మెల్లప్పుడున్భాస్కరా, పద్మినీవల్లభా, వల్లకీగానలోలా, త్రిమూర్తిస్వరూపా, విరూపాక్షనేత్రా, మహాదివ్యగాత్రా అచింత్యావతారా, నిరాకారధీరా, పరాకయ్యయోయయ్య ! తాపత్రయాభీలదావాగ్ని దుర్దాంత, నిర్ధూతనిస్సార గంభీరసంభావితానేక నీకంబులం నాకియే కాకనైచిక్కి యేదిక్కులం గానలేకుండ నున్నాడనీవాడనో తండ్రి జాలియు మానాకటాక్షంబులన్నన్ను వీక్షించి వేగంగృపాదృష్టి చేతన్ము

డించందారికు సాన్నిధ్యముం గొంటి యశ్వంబు దా?ం
టించ కర్ణింబు మూర్తాంశుడై చెందవారాక్షు సాధకు
లంగాంచ కర్మానుసారోగ్ర దోషంబులంద్రుంచి కీర్తి
పరితాపంబులన్ మించి నిదానులంగాంచి దృష్టార్థ
ముల్ యిత్తునో దృష్టి వేల్పా మహాపాప కర్మాలకున్నా
లయంబైనయీదేహభారంబు భారంబుగానీకు సూరో
త్తమా యొప్పులం దప్పులం నేరముల్ మానిపహ స్రాం
శుడాపట్టినీకీర్తిగీర్తింప నేనెస్తు నాద్వాదశాత్మా దయాళు
త్వముం దత్వముం జూపినాయాత్మ భేదంబులంబాపి పో
షింపనీవంతె నిన్నుంబరీశం స్మింపసాశేషభాషాథిపుల్ గా
నగాలేరు నీదివ్య రూపప్రభావంబు గానంగ నేనెంత
నెల్లప్పుడున్ స్వల్పజీవుండ నేనీచుడన్ మహాకష్టుడన్ని
ష్ఠయున్ లేదు నీపాదపద్మంబు తేసాక్షి దుశ్చిత్తముం
బాపి నిశ్చింతుగ జ్జేయవే కామితార్థప్రదా శ్రీమ
హాదైవరాయా పరావస్తువైనట్టి మూడక్షరాలన్ స్వ
రూపంబు నీదండకంబిమ్మహిన్ వ్రాయ గీర్తించి వి
న్నన్ మహాజన్మజన్మాంతర వ్యాధిదారిద్ర్యముల్ పోయి
కామ్యార్థముల్ రంగు బంగారు తంగేడు జున్నై ఫ
లించున్ మహాదేవదేవా నమస్తే నమస్తే నమస్తే నమః॥

శ్రీ స్వ.

దశావతారాష్టకము.

అష్టకము- భైరవిరాగము- త్రిపుటతాళము:

శ్రీమదలమేల్మంగనాయక సింధుశయనజనార్దనా। స్వామినామనవాలకించుము సార్వభౌమదయానిధీ॥

పల్లవి॥

పామరుడ హంకారుడనునే పాపకర్ముడకుటిలుడన్। తామసుండను నీచుడను దలచనాత్రమేమయా॥

ఉపపల్లవి.

సోమకుడు వేదములు ముచ్చిలి జొచ్చిఅబ్ధిలోలో డాగినన్। స్వామిమత్స్యంబయ్యు దనుజునిజంపితివి ప్రఖ్యాతిగాన్॥

సురలు అసురులు పాలకడలిని దరువ మేరువ క్రుంగనన్॥ వరకమఠమయి గిరిని మోసిన పరమ పురుష పరాత్పరా॥ భీకరంబుగ ధరణి నబ్ధిలో నూకగా భర్మాక్షునిన్। సూకరంబయి నాసినణచిన లోకనాయకుడీవెకా॥ హరిని జూపుమటంచుబాలుని అడిగి స్తంభము వేసినన్॥ నరమృగాకృతిదాల్చి దనుజు

నను అడిగితివి మూడడుగులిలా। అడుగుకిందను బలి
ని నణచిన •పుడమి యేలిన శ్రీపతీ॥ వార్త కెక్కిన
కార్తవీర్యుల వంచుటను జమదగ్నివయి। కార్తవీర్యుల
నణచి విశ్వము కాచితివి ప్రఖ్యాతిగాన్॥ రావణు
డు గర్వించి సురులను రమణులను చెరనుంచగా। నీ
వు దశరథ తనయుడై యారావణునిబోరిగొంటివా॥
అష్టదశ అక్షోణుల కౌరవుల ప్రాణము బాపశ్రీ। కృ
ష్ణుడయి జన్మించి స్త్రీలను క్రీడ నేలిన శ్రీపతి॥ అసు
ర స్త్రీల మహాత్వ మెల్లను అణచుటకు బౌద్ధుండవయి।
బిసరు హోత్రుల వ్రతము జెరచిన •బిందునాద కళాత్మ
కా॥ కల్కితురగము నెక్కి కరముల తళుక్కుబత్తిసా
యుధాల్। గుల్కుచును ఖలులన్వధించిన కల్కిని
ను ప్రార్థించెదన్॥ వురగశైలమునుండి ఘంకిణి సురను
ద్రుంచియుగోనుగూర్రు। గ్గిరిని వెలసిన దొరవునిను
నే మరువజాల మహాప్రభో॥ పరను జగన్నాథదా
సుడు తలచిశరణని వేడిసన్। వెరపుదీర్చక యున్న
వేమయ వేటరాయ మహాప్రభో॥ నరులు యీ
అష్టకము మరువక స్మరణ జేసిన వారికిన్। సిరులు
నాయువు యిహము పరముసుశ్రీని వాసులు యొ

గోదావరిజిల్లా కాకినాడ నగర శ్రీవేంకటేశ్వర విద్యాసాగర ముద్రాక్షరశాలలో యీరకం హెడ్డింగులు బైపుతో తప్పులులేకుండ, దళసరి కాగితములపైని ముద్రించి చవుకధరలకు విక్రయించబడు శతకములు వగైరా గ్రంథముల పట్టిక:—

శతకములు.

నృసింహ। భాస్కర। తాడేపల్లి। వేణుగోపాల। శ్రీవేంకటేశ్వర। దాశరథి। సుమతి। కృష్ణ। దేవకీనందన। చెన్నమల్లేశ। జానకీపతి। కాళహస్తి। రామతారక। భళిరకరి। జయటమూరామ। కాళహస్తిలింగ। వరలక్ష్మీనరసింహా। కస్తూరిరంగ। సూర్యనారాయణ। ప్రసన్నరాఘవ। భద్రాద్రిరామ। సీతాపతి। కుమార। ప్రసన్నాంజనేయ। సంపగిమన్న। దాసపోష। రుక్మిణీకల్యాణం। కుమారి। మొదలైనశతకములును। వచనరూపకములు। నలచరిత్ర। హరిశ్చంద్ర। శశిరేఖ। గయోపాఖ్యానం। అధ్యాత్మరామాయణం। విశ్వగుణాదర్శము। మొదలగునవి గేటుపైమరితోముద్రించబడు కథలును స్త్రీలకుపయోగించు ౧౦౦ రకముల పాటలును విక్రయించబడును.

